ముద్రణ:
మొదటిది

ప్రతులు:
వేయి.

జూన్,
1973.

వెల:
1-50.

ముఖచిత్రం:
కరామత్

ప్రచురణ:
సాహితీమిత్రులు, నల్లగొండ.

ముద్రణ:
అనుమాల ప్రెస్, నల్లగొండ.



సాహిత్యం సమాజానికి దర్పణంకావాలి. దర్పణంలో జీవితాలు ప్రతిబింబించాలి. ఆ ప్రతిబింబం ద్వారా వ్యక్తి తనను తాను దిద్దుకోవాలి బాగుపడాలి. అలా ప్రతి వ్యక్తి బాగుపడితే సమాజం తనంత తానే బాగుపడుద్ది. ఈ ఆశయాన్నే దృష్టిలో వుంచుకొని మేమీ ప్రచురణలకు పూనుకున్నాం. అందుకు తొలి ప్రయత్నంగా "లోకం" కథల సంపుటిని మీ ముందుంచుతున్నాం.

**సాహితీ మిత్రులు, నల్లగొండ.**

# ఇందులో

అంచులు నిండిన ఆనందానికి
వరదలై పారిన విషాదానికి
కారకుడైన శ్రీకాంత్‌కు—

# మనసు–

"చూస్తారేంరా, తన్నండి. కన్ను మిన్ను గానకుండా బలిసి అడ్డమయిన తిరుగుళ్లు తిరుగుతుంటె, మూతిమీద మీసం పెట్టుకుని ఎలా ఊరుకుంటార్రా" —ఓ గొంతు.

"ఎయ్యారెసేయ్యి, ఒళ్లంతా చితుక కొడితేగాని రోగం కుదరదు" —మరోగొంతు.

"అట్లా కొడితే సిగ్గొస్తదట్రాదానికి. సిగ, ముక్కు రెండు కోస్తే బ్రతికున్నన్నాళ్లు కుమిలి కుమిలి చస్తుంది" —ఇంకో ముసలి గొంతు.

"అయినా పురుగు పుట్రా తిని పుట్టలుండమంటే ఊరు సుద్దులన్నీ నాపాలే అన్నట్లు, ఆడు కూకోబెట్టి మేపుతుంటే తిన్నదరగక, మస్తెక్కి ఊర్కెట్టుంటుంది మరి." —ఎడంచేతిని నడుంకానించి, కుడిచేతిని అటూ ఇటూ తిప్పుతు అంది ఓ నడి వయస్కురాలు.

"అయినా ఈ కాలమే యిట్లొస్తుందట్రా. మరి ఉండ డానికో పోవడానికో కాని, గింత గింతోళ్లకు ఎంతోయిది. అయినా పాపం పెరిగిపోతోంది. అందుకే అనల్లేవు పంటల్లేవు," మరో ముసలమ్మ.

పల్లెలోని ముత్యాలమ్మ గుడిముందరి వేపచెట్టు క్రింద గుమికూడిన రక, రకాల వ్యక్తులు రక, రకాలుగా అంటున్నారు. గోళ్లు గిల్లుకుంటూ సిగ్గు, అభిమానం ఆవిరై పోగా పాలిపోయిన ముఖంలో భయం కనిపిస్తూంటే తల వంచుకొని నిల్చుంది అచ్చిమి.

"వాడేడిరా ......... వాణ్ణి వదలిపెట్టారేం, వాణ్ణి గుంజుకరండి. మొదట వానొళ్లు మెదగాలి."

"అవునసే, పక్కలిరగ తంతేగాని తిక్కతిరగడు." అంతలో రెక్కలు వెనక్కు కట్టి వుంచబడ్డ నర్శిగాణ్ని ఇద్దరు

నెట్టుకొచ్చి గుంపు మధ్యన నిలబెట్టారు. ముఖాన రక్తంచుక్క లేదు. తప్పుచేసినతనం ప్రతి కదలికలో కనిపిస్తోంది.

తలవంచుకుని నిలబడ్డ నర్సిగాని ఎదురుగాపోయిన ఓ నడి వయస్కుడు తుపుక్కున ఊసి "దున్నపోతులా బలిస్తే—— ఏం చెయ్యాలో, ఏం చెయ్యకూడదో ఎలా తెలుస్తుందిరా. ఒంగ బెట్టి బండలెత్తితేగాని నీమస్తనగదు."

"కాదు కాదు సువ్వగాల్చి ఇద్దరికి ఒళ్లొలుపునా వాతలు గుంజితేగాని —— వాళ్లుచేసిన పనికి ఆదే తగిన చిగిచ్ఛ."

"ఓరి ముదనష్టపు ముండాకొడుకా నీకేం పోయేకాల మొచ్చిందిరా పండటువంటి సంసారాన్ని పాడుచేసినావు. నీకు అక్కా, చెల్లెళ్లు లేరటరా" అంది ఓ అవ్వ ముక్కుమీద కుడిచేతి చూపుడువేలు ఆనిస్తూ——

ఒకడు నర్సిగాడిని చెంపమీద కొట్టాడు.

మరొకడు తుపుక్కున ఊసాడు.

ఇంకొకడు పళ్లుకొరికాడు.

వేరొకడు కళ్లెర్రజేసి చూశాడు.

ఒక్కొక్క మనిషి ఒక్కొక్క మాటంటుంటే, కొరడాతో కొట్టినట్టుంది నర్సిగాడికి. వలలో చిక్కిన సాధురంలా లచ్చిమి, బోనులో పడ్డ పులిలా నర్సిగాడు ఇద్దరూ తలవంచుకుని నిలుచున్నారు. పెద్దమనుషులు వారిని ఏమేమో అడుగుతూ, తీర్పు చెప్పాలా లేక పంచాయతీకోర్టులో పెట్టాలా

అన్న ఆలోచనలో బడి యింకా ఓ నిర్ణయానికి రాలేక పోతున్నారు.

"అయ్యో మనం చూడంగా దాన్ని ఏం చిన్న చూపు చూశాడని, తిండికి సంపిండా, బట్టకు సంపిండా అసలెందుకీ పని చేసినట్లు."

"ఆడిం కెవతినన్న మరిగిండేమో."

"ఛీ ఛీ అట్లాంటివాడు కాడే వాడు. ఆనికాచితిలాంకి బుద్దులు లేనేలేవు."

"మరెందుకిదీ పని చేసినట్లు ?"

"అయినా చేసేవాండ్లందరూ ఎందుకీ పని చేస్తుండ్రన్న సంగతి తెలిస్తే ఈ రంకు రంగే వెలుస్తుంది."

ఇంతలో గుంపులో గుసగుసలు బయలుదేరాయి. బస్సు దిగిన మల్లయ్య చేతిలో ఆరోజు దిన పత్రికను పట్టుకుని గుంపు వైపు వస్తున్నాడు. చెట్టుక్రింద కూడిన మందిని చూడగానే మల్లయ్య మనస్సులో ఆలోచనలు ముసిరినవి.

"ఏమయ్యుంటుందబ్బా! ఇంతజనం ఎందుకు కూడారు, ఏదో కొట్లాట జరిగుంటుంది."

భుజంమీది సిల్కు కండువా అంచును పండ్లమధ్యన కరచిపట్టి తదేకంగా గుంపువైపు చూస్తూ వస్తున్నాడు.

మల్లయ్యది ఎత్తైన విగ్రహం, బలిష్టమైన శరీరం. కష్టం

చేసుకొని సంపాదించి, సుఖం పొందాలంటాడు. మంచీ, చెడు తెలిసిన మనిషి కాబట్టే అప్పుడప్పుడు పెద్దమనుష్యులకు సైతం బుద్ధిచెబుతుంటాడు

"మల్లయ్యకెరుకలేనట్లుంది." —ఒకావిడ.

"అవును పాపం ఏంచేస్తాడోపమో" —మరొకావిడ.

"కొంపతీసి కొట్టిచంపుతాడేమొ, వీళ్లని తప్పదీస్తే" ఇంకొకావిడ.

మల్లయ్య గుంపును సమీపిస్తున్నాడు. గుంపు మల్లయ్యవైపు చూస్తున్నారు. మల్లయ్యను చూచిన లచ్చిమి ప్రాణం— దీపానికంటుకున్న పురుగులా కొట్టుకుంటోంది. ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకొని నీళ్లునిండిన కళ్లతో అతనిని చూడలేక నేలను చూస్తోంది. శరీరమంతా చెమటతో నిండినా నోటిలోమాత్రం తడిలేని నర్సిగాడు మల్లయ్యను, అతని రాకను చూసే స్థితిలోలేడు.

గుంపును సమీపించిన మల్లయ్యకు ఎవరూ ఏమీ చెప్ప లేదు. ఎవరినీ ఏమీ అడుగలేదతను. వెనక్కి చేతులు కట్టి వుంచిన నర్సిగాణ్ని, కొంతదూరంలో తలవంచుకుని నిలబడ లచ్చిమిని చూడగానే మల్లయ్యకు ఎవరో తన గుండెలో బాకుతో పొడిచినట్లనయింది. ఏదోసుడిగాలి అతనిని చుట్టినట్ల యింది. ఎంతో వేగంతో పొయ్యే వరదలో కొట్టుక పోతున్న ట్లయింది. మల్లయ్యకు కళ్లముందు గతం కదిలాడించి.

...కొత్తచీర కట్టుకున్న లచ్చిమి కాళ్లకు మొక్కుతోంది.

...తిరనాళ్లలో గాజులు, మెట్టెలు పెట్టుకున్న లచ్చిమి తనవైపు చూస్తూ యివి చల్లగుంటే చాలంటోంది.

...దేవునికి దీపారాధన చేయిస్తే మన కడుపున ఓ కాయ కాయకపోతుందా అంటోంది—

...అర్ధరాత్రికాడ బావికాడికి పోతుంటే పురుగు, బూసి జాగ్రత్త అంటోంది—

...నేను నీకు, నాకు నీవు తప్ప లోకాన మనకింకేముందంటోంది—

అబ్బ! ఆ లచ్చిమియేనా యీ లచ్చిమి? ఎంత పని చేసింది? రక రకాల ఆలోచనల్ని అదుపులోపెట్టుకొని, పొంగి వచ్చే దుఃఖాన్ని అణచి పట్టుకున్నాడు మల్లయ్య. ఎంతో మందివున్నా ఎవరూ లేనట్లుగా నిశ్శబ్దం ఆవరించిందా చావడిని. భుజంమీది సిలుకు కండువా ఎడమచేతిలో నలిగిపోతూంది. దిన పత్రిక జారి క్రిందపడింది. మల్లయ్య మందిని చీల్చుకొని కొద్ది దూరంలోవున్న తన యింటివైపు నడిచాడు. అందరూ అతని వైపే చూస్తున్నారు. కొంతసేపటితర్వాత లచ్చిమికి సంబంధించిన చీరలు, రెవికలన్నింటినీ మోపులా చేతపట్టుకొచ్చి రాతిబొమ్మలా నిలబడ్డలచ్చిమిపైకి విసరి ఎవరి ముఖం చూడకుండా తలవంచుకుని రోడ్డువైపు నడిచాడు.

అంతవరకూ చూస్తూ ఊరుకున్న జనం ......

"ఇది ఊరా పాడా"

"నేనెంత మొనగాడోననుకున్నా— చంపుతాడో, నరుకుతాడోననుకున్నా"—

"అయినా వాడికే శరంలేనిది మనకేంబట్టిందిరా."

"ఏరో ఎట్లనో మాట్లాడుతవూ— పసుఃకు పసులే కాస్తా మట్రా."

"వాడు బుద్ధిచెప్పకపోయినా మనమన్నా ఏదో చిగిచ్చచేయాలి. ఇట్లానే వదలిపెడితే, యియ్యాల యిది, రేపు యింకోటి— ఆ తర్వాత ఊరంతా పాడేకదా!"

"ఛీ! రండాకొడుకు; పెళ్లాం రంకుచేస్తే ఏంసక్కా ఏమనకుండా వదలి పెట్టాడు."

—అంతవరకూ అన్నీ ఓపిగ్గా వింటూ వేపచెట్టుమొదలుకు ఆనుకు కూర్చున్న గోపన్న దారంతో కట్టుకున్న కళ్లద్దాలను సవరించుకుంటూ కర్రసహాయంతో లేచి గుంపు మధ్యకొచ్చి...

"ఎవర్రా చిగిత్స చేసేది, మల్లిగాడు రండనా, మీరంతా మొనగాళ్ళా— మీకంటే వాడే నయంరా— ఎవరికి తెలియదురా మీ సంగతి?" అంటూ కుడిచేత్తో కర్రపట్టుకుని ఎడమచేత్తో రొమ్మును చరుస్తుంటే అతుకుబడ్డ ఫ్రేంలోనుండి తెల్లని సీసపుగోళీల్లాంటి కనుగ్రుడు ఉద్రేకాన్ని చిమ్ముతున్నాయి. ముడతలుబడ్డ మొఖం—ముడతలలో ఎనుబయి సంప

త్సరాల అనుభవం కనపడుతోంది.

ఒకవైపు మళ్లీ "నీవు రాసిని దోచలే."

మరొకనివైపు మళ్లీ "నీవు పెళ్లిగాని పిల్లను పల్లెకు లేపుకరాత్ర"

ఇంకొకనివైపు మళ్లీ "కొండ్రెడు భూమికోసం నీవు నీ తోడబుట్టిన అన్ననే చంపలే."

ఇలాంటివన్నీ చిగిత్సకావలసిన తప్పులు కావా? అయినా మీరు తప్పుకుతిరుగుతూ-ఊళ్లో తప్పులను ఎంచుతున్నారెందుకురా ఇంతకీ మల్లయ్య ఏం తప్పుచేసిండని ఏదో అడబలిసి ఆనెవ్వుడిపోతే నీవెతుక్కున జాటన నీవే పొమ్మనడంతప్పా? నిజంగా చెప్పాలంటే వాడేరా మనిషి. మీరంతా పెద్ద మొనగాండ్లయి వాడు చేసిన పనిని ఎగతాళి చేస్తున్నార్రా. సిగ్గు లేదురా మీకు. అయ్యో, నర్సయ్యా యిక పోనాయనా, యీామెను నీవే ఉంచుకుని సంసారంచెయ్యి. ఏదో లేచిన ఘడియ మంచిదయింది. నీ అదృష్టం బాగుంది." అంటూ క్రసహాయంతో వెళ్లిపోయాడు గోపన్న. ఎవరూ ఎదురు మాట్లాడలేక గొణుక్కుంటూ కదిలి పోయారు.

* * * * *

వారం రోజుల తర్వాత......

నర్సిగాని ఇంటిముందు జనం గుంపులు గుంపులుగా నిలుచున్నారు. కొందరు యింట్లోకి తోసుకు పోతున్నారు

"సచ్చి సాధించేదేముంది." అంటూ బయటకు వస్తుందో ఆవిడ.

''ఏందేంది'' అంటూ ఎదురయింది అప్పుడేవస్తున్న మరో ఆవిడ.

''ఏముంది లచ్చిమిని నర్సయ్యా నుమంకట్టుకోను వెళ్లిపొమ్మన్నాట్ట. రాత్రి పండజూసి నర్సయ్యా తలపై రాయెత్తేసి చంపి ఉరోసుకుని చచ్చింది......''

అప్పుడే బస్సుదిగి వస్తున్న మల్లయ్యావిని— ఓ నిట్టూర్పు మాత్రం వదిలి, తన యింటివైపు నడిచాడు. • • •

# గాంధి పుట్టిన దేశం

రాత్రి. చీకటి రాత్రి. కాటుకలాగ, కలంలోని నల్లసిరా లాగుంది. పాకిస్తానీ సైనికుల కంట్లో కారంచల్లి, సరిహద్దు గస్తీ జవానులను తప్పించుకుని, భారత భూభాగంలోకి చొచ్చుకొనొచ్చాడు కాశీం. అయినా అతని గుండెదడ ఆగడంలేదు.

ఎక్కడో విజిళ్ళ చప్పుడు. సర్చ్ లైట్స్ ఫోకస్

దూరాన జీప్ వస్తున్న శబ్దం. కాశీం కళ్లలో నడుస్తున్న భయం. హృదియాన్ని అదిమిపట్టుకుని చుట్టూర చూశాడు. మెల్లగ దగ్గరున్న ఓ చెట్టెక్కి కూర్చున్నాడు. జీప్ శబ్దం దగ్గరౌతోంది. వళ్లంతా చెమటపడుతోంది.

జీప్ తనవైపే వస్తోంది. నోటిలో తడి ఆరుతుంది. క్షణంలో మిలటరీ జీప్ చెట్టుక్రిందనుండి రివ్వున దూసుకుపోయింది. బల్లిలా కొమ్మకు హత్తుకుపోయిన కాశీం కొంత సేపు ఊపిరి బిగపట్టాడు.

జీప్ ఫర్లాంగు దూరం వెళ్ళింది. దాని హెడ్‌లైట్స్ కాంతిలో ఓ టౌన్ కనపడుతోంది. కాశీంకు ప్రాణం లేచొచ్చినట్లయింది. యిండ్లమధ్యనుండి జీపు దూసుకుపోయింది. కాశీం మనస్సు కాస్త కుదుటపడింది.

చెట్టుదిగి నక్కుకుంటూ, నంగుకుంటూ టౌనువైపు నడిచాడు. మెల్లగవెళ్లి ఓ యింటిగేటుముందు నిలిచాడు.

"భౌ" మంది వరండాలో, అలికిడివిన్న ఆ యింటి అల్సేషన్ కుక్క. కంపనం పుడుతున్న కాళ్లను నిలదొక్కుకుని కదలకుండ నిల్చున్నాడు కాశీం. ఆగకుండా మొరుగుతున్న కుక్క అరుపు విని కాబోలు ఓ యువకుడు వరండాలోకొచ్చాడు. గేటు సువ్వల మధ్యనుండి శిలావిగ్రహంలా కనపడ్డాడాయువకునికి కాశీం.

"ఎవరు?"—వరండాచివరికొచ్చి.

"ప్లీజ్. ఓ నిముషం ఇటొస్తారా?" బావిలోనుండి వస్తున్న శబ్దంలా కాశీం కంఠం.

గేటును సమీపిస్తున్న యువకుడు, అతన్ని అనుసరిస్తున్న అల్సేషన్ కుక్క, బాగా బలిసిన సింహంలా నడుస్తోంది.

"ఎవరు కావాల?" గేటును సమీపించిన యువకుడు.

"రాత్రయింది. ఈ ఊరికి క్రొత్త. కాస్త యీ రాత్రి... యిక్కడ......"

నమిలి మింగేట్లు చూస్తోంది కుక్క, కాశీంను.

మౌనంగా కుక్కను చూస్తున్నాడు యువకుడు.

"అనుమానం పడుతున్నారా?" దీనంగా కాశీం.

"అబ్బే లేదు. రండి." గేటును తెరిచాడు.

కుక్క పగవాణ్ణి చూసినట్టు చూస్తోంది. అది గమనించిన కాశీం, దాన్ని కాస్త లోనికి పంపండన్నట్లు సైగ చేశాడు లోనికి వస్తూ.

"నేనున్నానుగా-ఏమనదు. ఏయ్ టైగర్ లోనికిపో." గేటును మూస్తూ. కిమ్మనకుండా తోకముడుచుకుని పోయింది కుక్క, నమ్మకమైన నౌకరులా. ఇద్దరూ లోనికి నడిచారు. డ్రాయింగ్ రూం తెరచి, క్రొవ్వొత్తి వెలిగించాడు.

"కూర్చోండి." సోఫాను చూపిస్తూ తాను ఎదురుగా కూర్చున్నాడు.

"మీ పేరు?" సోఫామీద కూర్చుంటూ అడిగాడు కాశీం

"అజయ్."

చక్కని విగ్రహం. తెల్లని రంగు. చురుకైన చూపులు. ఎదిరీద అజయ్‌ను చూస్తున్న కాశీంకు తన పెద్దకొడుకు జ్ఞాపక మొచ్చాడు.

"మీ పేరండీ?"

"కాశీం అలీఖాన్; కాని అందరూ కాశీం అంటారు."

దారి తెన్నూ తెలియకుండా పరుగెత్తుకు రావడంవల్ల చెట్లు చేమలు, కొమ్మలు రెమ్మలు తాకి కాశీం షేర్వాని అక్కడక్కడ చినిగింది. ఎక్కువ భాగం నెరసిన గెడ్డం—అరవయి సంవత్సరాలకు సాక్షంగావుంది.

"ఎక్కడ నుండొస్తున్నారు?"

"బంగ్లాదేశ్ నుండి." అలసట ధ్వనిస్తుంది ఆతని గొంతులో.

అంతలో సైరన్ చప్పుడు. విమానాల మ్రోత. ఇద్దరూ యాంత్రికంగా నోట్లో కర్చీఫ్ పెట్టుకొని, చెవులను బిగ్గరగా మూసుకొని బోర్లపడుకున్నారు.

కొన్ని క్షణాలు అతిభయంకరంగా గడిచాక, మళ్ళీ సైరన్ మ్రోగింది. ఇద్దరూ యథాస్థానాల్లో కూర్చున్నారు.

"ప్రమాదం ఏమీ లేనట్టుంది. మా పైలట్స్ చాలా తెలివైనవారు లెండి."

కాశీం మౌనంగా కూర్చున్నాడు. అతని మనసు నిండా ఆలోచనలు.

"యిక్కడికే వచ్చారా? లేకింకెక్కడికయినా వెళుతున్నారా?"

"లేదు ఎక్కడికి వెళ్లడం లేదు. చావునుండి తప్పుకోవడం కోసం యిక్కడికొచ్చాను."— ఏదో బాధ అతని ముఖం మీద కదలుతోంది.

"అంటే—" కాశీం కళ్లలోకి చూస్తూ అడిగాడు.

"ఏం చెప్పమంటారు, యాహ్యాఖాన్ మమ్ముల బ్రతుకనిచ్చేటట్టులేదు. బంగ్లా ప్రాంతాన్నంతా సర్వనాశనం చేసి, స్మశానంగా మార్చాడు"— అంటూ నిట్టూర్చాడు కాశీం.

సానుభూతి చూపులతో ఆసక్తిగా వింటున్నాడు, అజయ్.

"పాకిస్తానీ సైనికులు ప్రొఫెసర్లను, లాయర్లను, డాక్టర్లను, ఇంజనీర్లను, పత్రికలో వాళ్లకనుకూలంగా సంపాదకీయం వ్రాయలేదని నన్ను, దాదాపు మూడువందల మందిని పట్టారు. అందరినీ ట్రక్కులలో, జీపులలో పెద్ద అడవిలోని రెండు గుట్టల మధ్యకు తీసుకొచ్చారు. వరుసగ నిలబెట్టి మిషన్‌గన్స్ గురిపెట్టారు. చివర్న నన్ను నిలబెట్టారు. కొన్ని సెకండ్లలో

ప్రాణాలు పోనున్నవని చివరిశ్వాసను పీల్చుకుంటున్నాం. సైని కులు విజయగర్వంగా నవ్వుకుంటున్నారు. చుట్టూ చూశాను. ప్రక్కగ రెండుగ చీలిన ఓ పెద్దగుండుంది. దానిచుట్టూ చెట్ల పొదలు, సూర్యుడస్తమించడానికి సిద్ధంగావున్నాడు. రెప్ప పాటున ఎవ్వరికంటా పడకుండా ఆ సరియలోకి తప్పుకున్నా— యిక అంతే మిషన్‌గన్స్ మ్రోతలో "అల్లా" అన్న అందరి చావుకేకలు వినిపించాయి.'' కాశీం కంఠం జీరపోయింది.

''అబ్బా! భగవాన్.'' అన్నాడజయ్ మానవత్వం తాలూకు దయ, జాలి. అతన్ని కదిలించాయి.

''ప్రాణాన్ని బిగపట్టుకుని గువ్వలాకూర్చున్న ఆ ఇరు కైన సందులో. పది నిమిషాల తర్వాత మళ్ళీ అదే ట్రక్కులలో వెళ్లిపోయారు అందరూ. నేను ఎవరికంటా బడకుండా తప్పిం చుకు నొచ్చాను. కనీసం చచ్చిన శవాలైన చూడలేకపోయాను.'' కాశీం కనుకొలుకు లొదిలిన కన్నీరు పంటచేలోనుండి పొర్లిపో యే వర్షపు వరదలా జారుతున్నది, అతని నిండయిన గడ్డంలో నుండి.

"బాధపడకండి. అదృష్టం-చావుతప్పింది"— సాను భూతి పొంగివస్తున్న గొంతుతో.

"నేను బ్రతికాననుకో— కానీ దేశమంతా?'' మాటలు పెగలటంలేదు కాశీం గొంతులోంచి. పెల్లుబికే దుఃఖాన్ని అణచుకుంటూ, వరదలా వచ్చే కన్నీరు తుడుచుకున్నాడు.

"మీ ప్రభుత్వమే మిమ్మల్ని వేటాడి చంపుతోంది. సిద్ధాంతాలు యిస్లామిక్‌వి. ప్రభుత్వం మిలటరీది. ఏ సిద్ధాంతానికి చెందని రాద్ధాంతపు విధానం పాకిస్థానీది. మతాల పేరిట రాజ్యాల నేలుకుంటే వచ్చే చావేయిది చరిత్రనొక్కసారి తిరిగేసి చూడండి. ఏ మతం ఏం సాధించిందని? యుద్ధాల్ని సృష్టించి స్మశానాలను మిగిలించాయి. తోటి వాణ్ణి ప్రేమించడం, ప్రేమించబడటంలాంటి మౌళిక సిద్ధాంతాన్ని మర్చిపోతే తలెత్తేవన్నీ సమస్యలు, సంఘర్షణలే, వీటికంతుండదు. ఈ మారణహోమాలు తప్పవు." మనస్సులో కదలే భావాల్ని సూటిగా చెప్పుకు పోతున్నాడు అజయ్. కాశీం మౌనంగా వింటున్నాడు.

"మొన్నటి భయంకర తుఫాన్ తడారనేలేదు. మళ్ళీ మారణహోమం."

తుఫాను బీభత్సం కళ్ళముందాడింది కాశీంకు. హృదయాన్ని చీల్చుకొని ఓ నిట్టూర్పు వచ్చింది.

"చాలా రాత్రయింది. ఆ బెడ్‌కం సోఫాను సరిచేసుకోండి." అంటూ లేచిన అజయ్‌తోపాటు కాశీం లేచాడు.

"మరచాను అమ్మ, నాన్న లేరేం అజయ్" కొంత చనువు తీసికొంటూ అడిగాడు కాశీం.

అజయ్ మాట్లాడలేదు. మెల్లగనవ్వినట్లు ఒకవైపు పెదవిని కదిలించాడు బాధగా బరువుగ.

"చెప్పక తప్పదంటారా?"

కాశీం బిత్తరపోయాడు.

"చెబితే మీరు బాధపడతారేమో."

"అంటే!" అర్థంకాని చూపుతో.

"మా అమ్మను, నాన్నను చంపారు."

"ఎవరు?"

"మీరు! పాకిస్తానివాండ్లు"

కాశీం స్థంభించి పోయాడు.

"మా దేశసులను చంపడం, మా దేశస్థుల ఆస్తులను దోచడం మీ దేశవాసుల పనుల్లో ఓటిగద. నవకాళి సంఘటన నుండి మొదలుకుంటె ఏటేట దోపిడీలు, లూటీలు, కాల్పులు—దురాక్రమణలు, ఎప్పుడూ ఏదో ఒకటి.

నా చిన్నప్పుడు మా ఊళ్లోగూడా జరిపారు. మా ఇల్లు దోచారు. మా అమ్మను నాన్నను చంపారు."— అంతవరకూ కనుగ్రుడ్ల చుట్టూ నిండిన కన్నీరు జారి పెదవి మల్పులో ఆగి నట్లాగి జారుతున్నవి.

కాశీం మనస్సు కలవరపడింది.

"క్షమించండి మిమ్ములను బాధపెట్టాను."—

అజయ్ మాట్లాడలేదు.

"వెళ్లి పడుకోండి."

అజయ్ మౌనంగా వెళ్లిపోయాడు.

కాశీం బోల్ట్ వేసొచ్చి సోఫాలో చతికిలబడి, "యా—

అల్లా" అంటూ కళ్లు మూసుకున్నాడు— అజయ్ మాటలు ములుకుల్లా గుచ్చుకుంటున్నవి.

—తానెన్ని దోపిడీలు చేయించాడు. అదునుచూసి ఎంతమంది హిందువులను నిలువునా కాల్పించాడు. కాల్చాడు. హిందువులంటే అప్పట్లో అతనికి తగని ద్వేషం. వాళ్లందరూ కాఫిర్లు అనేవాడు. రాక్షసతాండవంలాంటి గతం— కాశీంను వూపిరి సల్పనివ్వలేదు. గుంజుతున్న కణతల నొత్తుకుంటూ ఎదురుగా గోడవైపు చూశాడు. రెండు బస్ట్‌సైజు ఆయిల్ పెయింట్ చిత్రాలు కనిపించాయి.

ఆరడానికి సిద్ధమయిన కొవ్వొత్తితో మరో కొవ్వొత్తి వెలిగించాడు. చిత్రాలదగ్గరికి వెళ్లి పరిశీలనగా చూస్తున్న కాశీం మనస్సు పదిహేనుఏండ్ల వెనక్కుపోయింది.

ఒకరోజు రాత్రి, అందరూ ఆదమర్చి నిద్రపోతున్న అర్ధ రాత్రి. ఈ యిల్లును దోశాడు తాను, తన అనుచరులు.

"హుఁ —హోనేదేవ్" సింహగర్జనలాంటి కాశీం అరుపు

"కుంజియాఁ నహీ దేరహేసాబు" అంటూ యింటి యజమానిని యిద్దరు వ్యక్తులు పట్టుకొచ్చి కాశీంముందు నిల బెట్టారు.

"క్యం" అంటూ గురిచూసి ట్రిగ్గరు నొక్కాడు కాశీం. నెత్తురు చిమ్ముకుంటూ నేలకొరిగాడు.

"చంపకండి, యివిగో తాళాలు" అంటూ యింట్లో

నుండి వస్తున్న అతని భార్యవైపు కాశీం రివాల్వర్ నిప్పులు కక్కింది.

ఆమె గుండె నెత్తురు కక్కింది.

"అమ్మా" అంటూ నిద్రలోనుండి లేచి కళ్లు నలుచుకుంటూ వస్తున్న పదేళ్ల బాబువైపూ కాశీం రివాల్వర్ కసిగా చూసింది. గుళ్లు అయిపోయినవని గ్రహించిన కాశీం అందరినీ రమ్మని సైగచేసి వెళ్లిపోయాడు.

"ఓ ఆ— బాబేనా! —ఈ అజయ్."

'అవును. ఆ బాబే ఈ అజయ్. నిన్ను చంపడానికి కాచుక్కూర్చున్నాడు! నీవు చావాల్సింది అజయ్ చేతిలోనే. నీ చావు మూడింది. అందుకే ఈ యింట్లో కొచ్చావు - నీ కిక చావు తప్పదు.' రెండు చిత్రాలు ఘోషిస్తున్నట్లు వినబడింది కాశీంకు—

"వద్దొద్దు నన్ను చంపొద్దు. నన్ను చంపొద్దు" అంటూ వెర్రివానిలా వెనక్కునడిచాడు.

'గన్ను పట్టుకుని అజయ్ రౌద్రమూర్తిలా గది తలుపులను తోసుకొనొచ్చాడు.'

అదరిపాటున కాశీం వెనక్కు తిరిగాడు. ఎవరు లేరు. ఎవరూ రాలేదు. కాలిరాలిన క్రొవ్వొత్తి చమురు చేతిమీద పడి చుర్రుమంది. వెంటనే ప్రక్కన ఉన్న టేబుల్ మీద పెట్టాడు. అక్కడ ఫోన్ కనబడింది. కాశీం వళ్లు జలదరించింది. దాన్ని

పీకిపారేస్తే బాగుండనిపించింది.

'తెల్లారదేం! వద్దు. తెల్లారొద్దు తెల్లారితే అజయ్ వస్తాడు. తనను చంపుతాడు. అందుకే తెల్లారొద్దు'

'పారిపోతే! 'అవును పారిపోవాలి' మెల్లగా డోరు తెరిచాడు. వరండాలో సింహంలా కూర్చున్న కుక్క గుర్రుమంది. కాశీం గుండెలో భయంనిండింది. నుదుటిమీద చమట కనుబొమ్మలమధ్యనుండి కారి, ముక్కుచివర ఆగి చుక్కలుగ పడుతోంది. మెల్లగా అడుగులో అడుగేసుకుంటూ వచ్చి సోఫాపై వ్రాలాడు.

గదంతా భయంతో నిండినట్లుంది. గదిలో భయం. గది బయటభయం. కదలికలో భయం. కళ్ళలో భయం. చూపుల్లో భయం. శ్వాసలో భయం. భయంగా బాధగా తెల్లారింది

తలుపు తెరుచుకుని గదిలోకి వచ్చిన అజయ్‌తోపాటు వెలుతురు వచ్చింది. కాశీం అజయ్ కెదురుగావెళ్ళి మోకాళ్ల మీద కూర్చుని, వళ్లో చేతులుపెట్టుకుని తలవంచి—

"నన్ను క్షమించండి......"

ఏమీ అర్థంకాని అజయ్ నివ్వెరబోయాడు.

"నన్ను క్షమిస్తావా అజయ్! మీ తల్లి దండ్రులను చంపింది నేనే."

అజయ్ అదిరిపడ్డాడు. కళ్లప్పగించి కాశీంను చూస్తున్నాడు. కళ్లలో జ్వాలలు లేస్తున్నాయి. ముఖం ఎరుపెక్కి

తోంది.

మసీదులో ప్రార్థనకు కూర్చున్న భంగిమలో కాశీం మౌనంగా కూర్చున్నాడు. అజయ్ అణువణువులో వుద్రేకం వుప్పొంగుతోంది. హృదయంలో ప్రతీకారవాంఛ రగులుతూ వుంటే ముఖంమీద శ్వేదజలం చిమ్ముతోంది. పౌరుషాన్ని పట్టివుంచిన పిడికిలిని వదలి ఫోన్‌వున్న టేబుల్‌ను సమీపించి డయల్ చేశాడు.

నీళ్లు నిండిన కళ్లతో తలపై కెత్తి కాశీం—

"నాదొక్క కోరిక— నన్ను మీరేమైనా చెయ్యండి— కానీ పాకిస్తానీ సైన్యాల కప్పగించకండి" దైన్యంనిండిన గొంతుతో.

"హల్లో— శరణార్థుల శిబిరాల కంట్రోలర్ గారేనా?"

"యస్......" అవతలి కంఠం.

"మా యింట్లో ఓ శరణార్థి ఉన్నాడు. తీసికెళ్లండి. హౌస్ నంబర్ 7-5-72 గాంధినగర్."

*

# కేసు వాయిదా పడింది

జడ్జిగారు రాగానే కోర్టంతా నిశ్శబ్దం ఆవరించింది. నిన్న వాయిదా పడిన కేసును ప్రస్తావిస్తూ పబ్లిక్ ప్రాసిక్యూటరు—

"యువర్ ఆనర్, ఇంతవరకు ప్లీడరుగారు అసలు సంగతుల్ని కప్పిపుచ్చి ఏవేవో కట్టు కథల్ని మీ ముందుంచి రంగా

రావుగారు నిర్దోషి అని నిరూపించారు. కానీ అదంతా అబద్ధం! మీ రనుమతిస్తే తగు ఆధారాలతో నిజాన్ని మీ ముందుంచ గలను" అన్నాడు ఆవేశంగా.

"ప్రొసీడ్ ఆన్" అని జడ్జీగారు అనుమతిచ్చి ఆసక్తిగా వినసాగారు.

"ఏ రంగారావుగారినైతే నిర్దోషి అని ప్లీడరుగారు నిరూపించదలచారో అతనే ఈ హత్యలకు కారకుడు."

కోర్టంతా ఒక్కసారి రంగారావువైపు చూసింది రంగా రావు అందరివైపు చూశాడు.

"ఈ రంగారావు చెన్నపురి గ్రామానికి మునసబు, ఆ ప్రాంతానికంతటికీ కూడా పెద్ద ఆస్తిపరుడు. ఈయనగారికి ఒక్కడే ఒక్క కుమారుడు; పేరు ప్రసాద్. ప్రసాద్ చిన్న తనంనుండి పట్నంలో చదివి మూడు సంవత్సరాలక్రితమే యం. ఏ. పూర్తిచేసి, కాలేజీలో లెక్చరర్‌గా చేరాడు.

ఇక నిర్మల, చెన్నపురికి దగ్గరలోవున్న ఓ పల్లె నివాసి యైన శివయ్య కూతురు. శివయ్య హరిజనుడు. పాపమతడు హరిజనుడుగా పుట్టటమే అతని దురదృష్టమేమో! నిర్మల మెట్రిక్ వరకు చదివి టీచరు ఉద్యోగానికి ప్రయత్నంచేసే రోజు లలో ప్రసాద్‌తో పరిచయమై, అది ప్రణయంగా మారింది. ఈ విషయం రంగారావుకు తెలిసింది. వర్ణవ్యవస్థను అక్షరాల పాటించే రంగారావుగారికి మిన్నువిరిగి మీదపడినంత పనయింది.

వెంటనే బయలుదేరి ప్రసాద్‌ను నానా చీవాట్లుపెట్టి తన వంశం, తన ప్రత్యేకతను వివరించి కులంవారి ముందు తనకు తలవంపు లయ్యే పనులు ఏవీ చెయ్యొద్దని హెచ్చరించి, కావాలంటే తన అంతస్తుకు సరిపోయే తన కులపు కన్యలను వందమందినయినా తెచ్చి పెళ్ళిచేస్తానన్నాడు.

ఎలాగైనా తన పెళ్ళికి తండ్రిగారు యిష్టపడరని తెలిసి ప్రసాద్, నిర్మల తిరుపతిదేవుని సన్నిధిలో పెళ్ళి చేసుకున్నారు. అది తెలిసిన ప్రసాద్ బంధుమిత్రులంతా, అతనిని, అతడు చేసిన పనిని విమర్శిస్తూ ఉత్తరాలు వ్రాశారు. వాటిలో నుండి కొన్ని వాక్యాలు మీ ముందుంచుతాను.

'ఈ ఉత్తరం రంగారావుగారు వ్రాసింది' అంటూ చదువసాగాడు.

'నీవు మా వంశాన చెడబుట్టావు. కులం, గోత్రం లేని ఒక మాలదాన్ని కట్టుకుని నా పరువు మర్యాదల్ని మంట గలిపావు గొప్పింట్లో పుట్టిన నీకు గొడ్డు మాంసం తినే పిల్ల ఎలా నచ్చిందిరా? ఒరేయ్! పెళ్లంటే ఏమనుకున్నావురా? అది నూరేళ్ళ పంట. బంధుమిత్రుల సమక్షంలో అన్ని యోగ్యతలున్న యువతికి తాళికట్టి అగ్నిసాక్షిగా యిరువురం వంశవృక్షాన్ని పెంచుతామని ప్రమాణంచేసే శుభ కార్యం. కానీ ఎక్కడో, ఎవతెనో, బజార్లో కలుసుకొని, గుడిలో దండ లేసుకున్నంత మాత్రాన సరిపోదు; సరికాదు.

'మాకు నీవు దూరమైనా లెక్కలేదు, కాని మా వంశ ప్రతిష్ఠ మొక్కబోవొద్దు. దాని తండ్రి శివ్వడూ చాలా సంబర పడుచున్నాడు. వాని అంతుతేల్చక తప్పదు" అని వుత్తరాన్ని ఫైళ్ళో పెడుతూ జడ్జిగారి వైపు చూస్తూ—

"యువర్ ఆనర్! అన్నంత పనీ చేశాడు. ఒక రోజు రాత్రి శివ్వయ్య తనయింట్లో నిద్రపోతుండగా నిప్పుపెట్టించాడు ఇంటికి. పాపం అతడు మంటల్లో నుసైపోయాడు"

"ఇక యీ వుత్తరం ప్రసాద్ మేనత్త వ్రాసింది."

"ప్రసాద్! నీకేం పోయేకాలంరా! కులంగాని కూడు తినకూడదురా! అయినా దానికైనా సిగ్గుండకూడదు. నక్కెక్కడా నాగలోకమెక్కడా!"

దాన్ని మడచి మరో వుత్తరం తీసి—

"ఈ వుత్తరం ప్రసాద్ మేనమామ వ్రాసింది."

"ఎంత పని చేశావురా! బంగారంలాంటి మరదలు వుండగా నీకేం పోయేకాలం వచ్చిందిరా! ఒక కులంగానిదాన్ని చేసుకున్నావట! ఉత్తమ కుల సంపన్నులు, సాంప్రదాయాలు పాటించే మా అక్క బావయ్యల కడుపున చెడబుట్టావురా! ఏ ముఖంతో పోతావురా ఆ మురికి పేటల్లోకి. కంపుకొట్టే వాడ ల్లోకి — నీ అత్తగారిల్లని, ఛీ! నీకు వుత్తరం వ్రాయటం కూడ నాకు నామోషి.'

"ఇంకా యిలాంటి వుత్తరాలు ఎన్నో వచ్చాయి. ప్రసాద్ వాటన్నింటికి సమాధానాలు వ్రాయకపోయినా వాటన్నిటికీ స వా లు గా తన డైరీలో యిలా వ్రాసుకున్నాడు."

'ఇలాంటి కులమత భేదాలతో నిండివున్న హిందూ సమాజం, ఒక జాతినిగాని, ఒక నీతినిగాని నిర్మించలేదు. మనిషికీ మనిషికీ మధ్యవున్న గోడల్ని తొలగించుకొని, మమతను, మంచినీ పెంచుకున్ననాడే ఈ సమాజం బాగుపడుతుంది. దానికి అందరి కృషి అవసరం.'

"ఏది ఏమైనా ప్రసాద్ తన సంసారాన్ని తెలివిగా నడుపుకున్నాడు. భార్యాభర్తలు చాలా అన్యోన్యతగా, ఆప్యాయతగా ఉండేవారని, భర్తే దైవంగా భావించిన పూర్ణ గృహిణి అని, వాళ్లు ఆదర్శదంపతులుగా వుండేవారని, ఆమె గర్భవతి అని తెలిసిన రోజు దాదాపు పండుగే జరిగిందని, ఆమెకు సంతోషం కలిగించే ప్రతి కోరికను ప్రసాద్ తీర్చేవాడని, ఎన్నడు తక్కువ కులంవాళ్లు అనే భావం అతని ఏ కదలికలోను రాలేదని వాళ్ళింట్లో పనిచేసిన పని మనిషి రంగమ్మ తన సాక్ష్యంలో మీ ముందు విన్నవించుకుంది."

"నిర్మల గర్భవతి అని తెలిసిన రంగారావుగారికి పగ, ద్వేషం పెరిగింది. ఈ నీచకులం దానితో కలిసి యుండటమే కాకుండా, వాళ్ల కలయికకు ప్రత్యక్ష సాక్ష్యాన్ని పుట్టించి తన

వంశానికే తీరని కళంకాన్ని సృష్టించబోతున్నారని తలచి ఓ కపట నాటకమాడి. ప్రసాద్‌కో ఉత్తరం వ్రాశాడు."

ఉత్తరం తీసి—

"చిరంజీవి ప్రసాద్ !

మీ నాన్న ఆశీర్వదించి వ్రాయడం, ఎంతైనా నీవు నా కొడుకువి. నీ పైన నా కెలాంటి ద్వేషం లేదు. కోడలు గర్భవతియని తెలిసి చాలా సంతోషిస్తున్నాను. మీ అమ్మే బ్రతికుంటే ఇంకెంత సంతోషించేదో! ఆమె లేని లోటు లోటే యైనా నేను పంపే కానుకను స్వీకరించండి.

—మీ నాన్న."

ఉత్తరం, తినుబండారాలు నౌకరు ఊరు నుండి తెచ్చే లోపలనే నిర్మలను హాస్పిటల్లో చేర్చారు. ప్రసాద్ తన తండ్రి పట్టుదల్ని, పంతాల్ని వదలినందుకు చాలా సంతోషించాడు.

నిర్మల కోసం పంపిన పదార్థాల్లో నుండి రెండు లడ్డూలు తిన్న ప్రసాద్ తన తండ్రి ఆప్యాయతను ఊహిస్తూ, మైకం కమ్మి క్రిందపడి గిలగిల తన్నుకుని కన్నుమూశాడు. అది కళ్లారా చూసిన రెండవ సాక్షి, నౌకరు కొండయ్యా తన సాక్ష్యంలో విన్నవించాడు.

హాస్పిటల్లో నిర్మల ప్రసవించింది. ప్రసాద్ మరణ వార్త విన్న పచ్చి బాలెంతరాలు అలాగే నేల కొరిగింది."

పి. పి. గారి కంఠంలో మార్పు వచ్చింది. నిశ్శబ్దంగా వింటున్న కోర్టు ఒక్కసారి నిట్టూర్చింది.

రంగారావు కనుకొలుకుల్లోంచి కూడా కన్నీటి బొట్లు రాలాయి.

జడ్జిగారు 'మానవతను' పరిశీలిస్తూ గంభీర ముద్రలో వింటున్నారు.

"రంగారావుగారి కులతత్వ పట్టుదలలే దీనికంతా కారణం. ప్రేమించుకోవడానికి, పెళ్లిచేసుకోవడానికి, కలిసి బ్రతకటానికి అడ్డువచ్చే ఈ కులం ఇంకెన్నాళ్లు......?"

గోడ గడియారం మ్రోగింది.

కేసు వాయిదా పడింది. *

# గత్తర

ఊరును తమరే కాపాడాలి పంతులుగోరు'' అంటూ రెండుచేతులు జోడిస్తూ, అన్న ముదుసలీ పాపన్నను అనుసరిం చారు ఘడిముందు గుమిగూడిన జనం. అప్పుడే లోపలినుండి వస్తున్న కరణంగారితో—

''అవును దొరా! నిన్న ముగ్గురు, రాత్రి ఐదుగురు,

పదిమందిదాకా సుడి బడిన్నారింకా'' యింకొకరు,

''అసలు సంగతేమిట్రా''— తనకేమి తెలియనట్లు అడిగాడు గ్రామ కరణం రంగారావు.

ఎత్తైన విగ్రహం. మత్తెక్కిన కళ్లు నల్పును కోల్పోతున్న తలవెంట్రుకలు నలుభై దాటినవని సాక్ష్యం.

''తమరికి తెలియందేముంది, పంతులుగారూ. ఊర్కి గత్తరొచ్చింది. ఈ గండాన్ని తమరే తప్పియ్యాలి.''

''గత్తర! అదెట్లొచ్చె మనూర్కి''— చూపుల్లో తెచ్చిపెట్టుకున్న ఆత్రుత. మాటల్లో అదోరకమైన అమాయకపు శబ్దం.

''ఎట్లొచ్చిందేముంది దొర. మొన్న లచ్చిగాడు పట్నం నుంచొచ్చాడు. వచ్చేరాడంతోనే కక్కుడు మొదలైంది. తెల్లారేవరకు వాడు, మల్ల పొద్దుగూకే వరకు ఆని పెండ్లాం, యిద్దర్నీ గద్ద తన్నుక పోయినట్టే...''

''మరి నా దగ్గరికొచ్చారేమిరా? సర్పంచ్ దగరి కెళ్లండి.''— కరణంగారి ముఖంలో ఏవో ఎత్తిపొడుపు ముద్రలు కనిపించాయి,

''సర్పంచు డాక్టరిని తీసుకొస్తాండుకు సమితికి పోయిండట, ఊర్లో లేడు.''

కరణంగారి పెదవుల మధ్య చిరునవ్వు నల్గింది. అతని గుండెలో గూడుకట్టుకున్న విషం కళ్లలోకి ప్రాకింది. దాన్ని

దాయడానికి కాబోలు కళ్లనొక్కసారి మూసి తెరిచాడు. వీళ్లం దరు గ్రామపంచాయతీ ఎన్నికలలో తన మాట వినందకూడా గుర్తొచ్చింది.

"మనుష్యులు చచ్చాక డాక్టరెందుకురా? అయినా, డాక్టర్లు గత్తరను కట్టినట్లు ఏ వూర్లోనైనా విన్నారా?"

"లేద్దొరా-లేదు" సగానికిపైగా.

"ఎక్కడయినలేదు" కొన్ని ముసలిగొంతులు కలసి కట్టుగా సాక్ష్యమిచ్చాయి.

"అయినా మన తాత తండ్రులు ఏ డాక్టరిచేత చేయిం చారు. యివన్నీ నడమంత్రపుచేతలు-" —అన్నాడు కరణం గారి నమ్మిన బంటు.

"గత్తరకు డాక్టరేమి చేస్తాడు. కడితే, మంత్రగాళ్లు కట్టాలిగాని" —పెద్దవాళ్ల సలహా.

అంత వరకు దోతి అంచును పరిశీలిస్తూ వింటున్న కరణం గారు— "అద్గదీ. మంత్రగాళ్లు కట్టవలసిందే."

గ్రామ తగాదాలలో తనను ఎదిరించి, తన పశువులు చస్తున్నా పట్టించుకోని మంత్రాల మారయ్యా మనసుతో మెదిలాడు.

"మరి, మన మారయ్యా నడగలేకపోయారా!"

"ఆడా! ఆనికేమి తెలియదన్నాడు పంతులుగోరు."

"తెలియదు! ఎందుకు తెలియదట? ఆసంగతేదో నేను

చూస్తగద.''

మస్కూరివైపు చూస్తూ— ''అరే! నీవెళ్లి వాన్ని పట్రా. పంతులు తొందరగా రమ్మంటున్నారని చెప్పు.''

గుంపులో గుసగుసలు.

''అవును. వాని పనే—''

''పుల్ల బెట్టిండు. మెల్లగ గూసుండు.''

''లేకుంటే యిస్లెన్నడన్నా జర్గిందా?''

నుదుట విభూతి, చేతిలో వెండి అంచులు వేసిన గండ్ర గొడ్డలి, భుజాన నల్లగొంగళి, ముంజేతులకు వెండికడియాలు, చెవులకు బంగారు పోగులు, బుఱ్ఱ మీసాలు, తట్టంత తలపాగాతో గుంపునుదాటి కరణంగారి ఎదుటికొచ్చి—

''దండాలు పంతులుగోరు'' గొడ్డలితోనే చేతులు జోడించి దండం పెట్టాడు.

''దండం. దండం.'' అంటూ నిలవెల్లచూశాడు మారయ్యను.

''మారయ్యగారు...''

''అయ్యా! అయ్యా! దొరలు. ఎందుకు అంతా నిష్ఠూరం.

''నిష్ఠూరం ఏముందింఠులో. నిజం అడగడానికే పిలిపించాం.''

"అడగండయ్యా......"

"నీ అంతటి మంత్రగాళ్లుండగా వూరంతా పీనుగుల పెంట్లై పోతుందేందని..."

"దానికి నేనేం చేయను దొరా..."

"నీవు చెయ్యకపోతే మరెవ్వరు చేస్తారేమి! కావలిసిన కార్యాలు చేసి ముందు గత్తరను కట్టు."

"నాకేమి తెలియదు దొరా. ఏదో పసులకంటే..."

"పసులకంటే - మనుషులకంటవు; మనుషులకంటే పసులకంటవు. అసలు నీ సంగతేమిటాంట."

"అట్లంటే ఎట్లా... ఏదో......"

"ఏదో లేదు, గీదో లేదు. ముందు గత్తర కట్టు..."

"అవునవును. పెట్టడమొచ్చు తీయడం రాదు."

బెల్లంగొట్టిన రాయి యయ్యాడు మారయ్య.

పిల్లలకు, పసులకు ఏదొచ్చినా మారయ్య బాగుచేస్తాడని ఊళ్లోవాళ్ల నమ్మకం. అంతేకాదు, పాము కాటుకు, తేలు కాటుకు పెట్టిన పేరట మారయ్య.

"అదంతా ఏం కుదరదోయ్. నీవు గత్తరను కట్టాల్సిందే. లేపోతే ఊరంతా పాడై పోద్ది."

మారయ్య మౌనంగా నిల్చున్నాడు.

కరణం మనస్సులో గతం కదిలింది. తన పశువులు

చస్తూంటే చూశాడు మారయ్య. తన పరువంతా పోతుంటే చూశాడు సర్పంచ్. యిదే అదును. యీ దెబ్బతో వీనికి శాస్త్రి వానికి చెడుపేరు— అవిశ్వాసం.

"మారయా! నీ యిష్టం. నేను చెప్పా. జనం నీ మీద కోపంగా వున్నారు."— జనంవైపు చూసి, "యిక మీరంతా వెళ్లండి. అన్నీ నే చూస్తా గానీ."

"మంచిది."

"తమరి దయ..."

"తమరే దిక్కు..."

"ఒరే మారయ్యా నీవీ గత్తరను కట్టకపోతే నిన్ను నర్కి గొనుక్కడతాంరా..." అంటూ అందరు కదలి పోయారు. మస్కూరి తప్ప.

"యింటున్నావా? నీ యిష్టం. వాళ్లను శాంతపరచాలంటే. నీవీ గత్తరను కట్టాలి. కావలసినంత ఖర్చు తీసుకొని అమ్మవారి పండుగ చేయుంచు, బలులు యిప్పించు. లేదా, నీవే బలై పోతావు. నీ యిష్టం. చూస్తూ నిల్చుంటే పనికాదు. చేస్తూవుంటే అవుద్ది."

"అరే. మస్కూరి! వూళ్లోని కుల పెద్దలందర్కీ చెప్పు, రాత్రికి అమ్మోరి పండుగని."

మారయ్య మాట్లాడలేదు.

"పండగైతే కానీ..." అంటూ కరణంగారు ఘడీలోకి

పోయాడు.

అమ్మవారి పండగ జోరుగా జరుగుతోంది. నడివీధిలో వున్న అమ్మవారి గుడిముందు పందిళ్లువేసి తోరణాలు కట్టారు. డప్పుల చప్పుళ్లు మారు మ్రోగుతున్నాయి. కులాల వారిగా కూర్చున్నారందరు. త్రాగడం తెలిసిన ప్రతివాడు బాగా త్రాగుతున్నాడు.

పందరి క్రింద పసుపు, పిండి, బొగ్గుపొడితో వేసిన పటాల సీద (ముగ్గుల్లాంటివి) అన్నంవండి కుంభం పోశారు. ప్రక్కనే కల్లుకుండలు పొంగుతున్నాయి.

మంత్రాల మారయ్య మోగల నిక్కరు తొడుక్కొని, చేతిలో నిమ్మకాయలను గ్రుచ్చివుంచిన నిలువుకత్తి పట్టుకొని అమ్మోరిదండకం చదువుతోన్నాడు. ఉన్నట్టుండి డప్పుల చప్పుడు ఎక్కువైంది. మైశాచ్చిపోగ గప్పున లేచింది. పోతును నరికారు. మేకలను, గొర్రెలను, కోడిపుంజులను ఒక్కొక్క వేటున నరుకుతోన్నారు. మరికొందరు తలలను ఊరపోసుకొని, వేపకొమ్మలను పట్టుకొని "హుస్...హుస్..." అంటూ సిగం పూగుతున్నారు.

రాత్రంతా పండగపేరుమీద జరగవలసినవన్నీ జరిగాయి. తాగడం, తినడం, తందనాలాడడం.

తెల్లవారింది.

పారమట్టను పిలుస్తూ గడిఎదుటకొస్తున్న కరణంగారి

కెదురుగా కొందరు పెద్దలెల్లగ—

"సర్పంచ్ గారింకా రాలేదా?"

"లేదుండీ......"

"ఎందుకొస్తాడు. వూరు ఏమైపోతే ఆయనకేం?"

"ప్రజల బాగోగుల చూడడానికి గదండీ ఆయన్ని ఎన్నుకుందీ......"—అన్నాడొక యువకుడు.

"సమితాఫీసు సల్లగుంటే చాలు. వాళ్లకి ఊరు, ఊర్లోని వాళ్ల సంగతెందుకు......"

"అయ్న డాక్సరిని తీసికరావటానికని వెళ్లి యింకా రాలేదేమి?"

"ఆఁ ఆయన వస్తడు— డాక్టరును తీసుకొస్తడు, మారయ్యను పిలు......"

"ఆడు మంత్రాలు చదువుతునే వున్నడు. ఒక్కొక్కరు చస్తూనే వున్నారు."

"యిక వాడిచేతకాదు. వేరే మంత్రగాన్ని పొరుగూరి నుండైన పిలిపించాలి."

"తొందర పడకండి." అక్కడికే వస్తున్న మారయ్యా నుద్దేశిస్తూ—

"ఏం మారయ్యా ఎక్కువైందట"—

"నేనేమి చెయ్యను దొర, చెయ్యవలసిన పనులన్ని చేశాను.

వీరేవాడెవ్వడో ఎగనూకినట్లుంది.

"ఆఁ యింకెవ్వడున్నాడు ఎగనూకడానికి."

"ఏ—యిదంత యీాడి పనే"— మందిలో నుండి ఒకడు.

"వీన్ని తంతేగాని కుదరదు."— యింకొకడు.

"నా కొడుకు చచ్చాడు" —ఓ తండ్రి.

"నా అయ్యచచ్చాడు" —ఓ కొడుకు.

"నా భార్య......" ఓ భర్త.

"నా భర్త—" ఓ భార్య.

"వింటున్నావా మారయ్యా— యిందరు చస్తుంటే చూస్తు కూర్చున్నావేం.

ఐదొందలు పెట్టి పండగచేయించావు. అయినా గత్తర నాపలేకపోయావు. నీ యిష్టం, వాళ్లంత కోపంలో వున్నారు. ఏం జవాబు చెప్పుతావో చెప్పుకో.

మారయ్య నోటినుండి మాట రావడంలేదు.

"వాడేమి చెప్పుతాడండీ, బొక్కలిరగ తంతే గాని చెప్పడు."

"వూర్కో, పండ్లూడగొడితే పోద్దసలు."

"చెప్పరసె చెప్పు. గత్తర కడతానంటావా, లేదా?"

—అంటూ ఓ వ్యక్తి అతన్ని రెక్కపట్టుకొని ఊపాడు.

"తన్ను తన్నర. సంగీతానికి సింతకాయలు రాల్తాయా? దెబ్బ పెడితేగాని——" అంటు మరొకడు తేశాడు.

సమయాన్ని గమనించిన కర్ణంగారి కనుబొమ్మలు సైగ చేశాయి.

చెంప ఛెల్లుమంది.

వీపున గుద్దాడొకడు

డొక్కలో తన్నాడింకొకడు

తలమీద కట్టతో బాదాడు మరొకడు.

"అమ్మో" అంటూ నేల కొరిగాడు మారయ్య.

తల రక్తం చిమ్మింది.

గుండె ప్రాణం వదిలింది.

యింతకు ముందే నరికి పడివున్న బలి జీవులలో మారయ్యా ఒకడైనాడు.

కరణం పగతీరింది. కాలి చల్లారిన పొగచుట్టను నేల కొట్టి, అందర్ని పిలిచి—

"ఎంత పని చేశార్రా. పోలీసుల కెరుకైతే యిప్పుడేం కావాలి ?"

అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. కళ్లలో భయం, కడుపులో బుగులు. తాగిన కైపు దిగింది. చమట పట్టి కాళ్లుచేతులు వణక సాగాయి.

కరణం మరొక చుట్టను వెలిగించి—

"భయపడకండి, నేను చెప్పినట్లు చేయండి. వెంటనే వీన్ని పూడ్చేసి, వీడుకూడా గత్తరలోనే చచ్చాడనీ చెప్పండి.

విషయం బయటకు పొక్కిందో మీరందరూ బోనెక్కాల్సిందే. అంతేకాదు జైలు పాలవుతారు."

అందరూ సరేనన్నారు. కట్టు కట్టేశారు, కట్టు తప్పితే కాలం కూడదన్నారు.

మారయ్యను పూడ్చడం ముగిసింది. గంట గడిచింది. గుడి దగ్గర నుండి ఘడి వైపు నడుస్తున్న కరణం హఠాత్తుగా ఆగిపోయాడు. కడుపులో తిప్పుతోందని కళ్ళుమూసాడు. గత్తరే తగిలిందని గజ గజ వణికిపోయాడు.

ఒకటి... రెండు...సార్లు, వరసదాటింది. ఆలస్యంవద్దు R.M P.ని పిలవమన్నాడు. వళ్ళు తిరుగుతోంది. కళ్లు బైర్లు కమ్ముతున్నాయి. పట్టణంలో చదువుకుంటున్న తన కొడుకు జ్ఞప్తికి వచ్చాడు. పెళ్ళికాని పెద్దకూతురు గుర్తుకొచ్చింది. పట్టాలు కాకుండా వుండిపోయిన భూములు కళ్ళముందు కదిలాయి. ప్రాణంమీద తీపి, గత్తరమీద కోపం పెరుగుతోంది. ఇంట్లోకి పోతె యింట్లోవాళ్ళకు తగులుతుంది. చావట్లో చస్తే బాగుండదు. అందుకని ఆసుపత్రికి కచ్చడం కట్టమన్నాడు. సర్పంచ్ డాక్టరిని తీసుకొస్తున్నాడా? అని చాలాసార్లడిగాడు.

అటూ ఇటూ అనే లోపలే కరణం కాలం నిండింది. గుండె ప్రాణం వదిలింది.

చావట్లోని దుమ్ములో పడివున్న శవాన్ని చూడలేని జనం అప్పుడే వస్తున్న అంబులెన్సువైపు పరుగెత్తారు. *

# లోకం

రాత్రి పన్నెండైంది. పట్టణమంతా నిశ్శబ్దంగా వుంది. వివిధరోగులకు నిలయమైన హాస్పిటల్ బాధగానే మూల్గుతుంది. వరండాలోని ఓ పిల్లరుకు వొర్గి నిలబడి నిర్మలమైన ఆకాశం వైపు చూస్తుంది స్టాఫ్‌నర్స్ జయ. ఆకాశం నిర్మలంగా వున్నా ఆమె మనస్సులో మాత్రం ఏదో అలజడిగావుంది. సాయంత్రం

జరిగిన సంఘటన జ్ఞప్తికొస్తూ మనస్సును మరీమరీ బాధిస్తుంది.

పక్క వార్డునుండి మేరి వచ్చి భుజం తట్టేంతవరకు జయ మనస్సు ఆలోచనల సుడిగుండంలోనే తిరగుతూవుంది.

''ఏం జయ, ఏమిటంత సుదీర్ఘమైన ఆలోచనలు?'' నవ్వుతూ అడిగింది మేరి.

జయ మాట్లాడలేక బరువైన శ్వాసవదిలింది.

"సారీ— నీ తీయని కలల్ని నేనెందుకు పాడుచేయాలి వస్తా..." అంటూ వెనక్కిమళ్ళబోయిన మేరీని ఆపి "అబ్బే ఏంలేదు మేరీ, ఇందాక వస్తుంటే దారిలో ఓ సంఘటన జరిగింది."

"ఏమిటో మరపురాని సంఘటన?"

"ఔను అది మంచిది కాకపోయినా మరపురానిదే"

''చెప్పగూడనిదా?''

"ఎందుకు చెప్పగూడనిదిలే, ఏమో మేరి మనమెంత సిన్సియర్ సర్వీస్ చేసినా మనలెవ్వరు గుర్తించరు. పోగా మనల ఏడ్పించక ఊర్కోరు, మొన్న డిస్‌చార్జ్ అయ్యాడు చూడూ ఒక కాలేజీ స్టూడెంట్, నేను హాస్పిటల్‌కి వస్తూంటే అతను, యింకా కొంతమంది విద్యార్థులు కలిసి ఏవేమో అంటూ ఎగతాళి చేశారు. నిజంగా మనం ఎంత మంచిచేసినా అంతకి మించిన చెడే లభిస్తుంది తప్ప మరేంలేదు. అతను హాస్పిటల్లో ఉన్నపుడు పరీక్షలు దగ్గరకొస్తున్నాయ్ అని రిక్వెస్ట్‌చేస్తే,

స్పెషల్ కేర్ తో ట్రీట్ మెంట్ చేశామా— బాగైంతర్వాత అత నిచ్చే బహుమతి ఇదా? అందుకే ఈ మగాళ్లంటే నాకు మహా అసహ్యం. వాళ్లకీ మనలాంటి అక్కచెల్లెళ్లు ఉంటారు కదా! మరెందుకలా ప్రవర్తిస్తారు?''

''ఆ మాటకొస్తే ఆడవాళ్లంతా మంచనా నీ అభిప్రాయం? ఒక్కొక్కసారి వాళ్లు వీళ్లకంటే మరీ ఘోరం. ఒక సారేమయిందో తెలుసా? రాత్రి రెండింటికి ఓ డెలివరీ కేసొచ్చింది. తొలి కాన్పట. సీరియస్‌గానే ఉంది. పాపం ఆవిడ భర్త ముఖం చూస్తే నాకే ఏడ్పొచ్చింది. చిన్నపిల్లోడిలా ఏడ్పు ముఖం పెట్టి—

''సిస్టర్—లేడీ డాక్టర్ లేరా——?''

''లేరు.''

''మా ఆవిడ''...అంటూ వెనుకనే ఆగిన రిజా వైపు చూపించాడు. అది గ్రహించిన నేను ''ఏం పర్వాలేదు- డాక్టరుగారు ఉన్నా లేకున్నా మేము ఉన్నాంగా. మీరలా కూర్చోండి'' అన్నాను.

అతనోమాదిరి బాధతో వెళ్లి వరండాలో ఓ వైపు నిల్చున్నాడు. అప్పుడతన్ని చూస్తుంటే నాకెంతో జాలేసింది. ఏదో బాధ, విచారం, ఆతరువాత, ఆందోళన అన్నీ అతని ముఖాన కదలుతూవుంటే నా భార్యను బ్రతికించండి-మీకు పుణ్యముంటుంది అన్నట్లు అతని చూపులు ప్రార్థిస్తున్నాయ్.

ఎట్లయితేనేమి ఆవిడకు కాన్పు చేశాము. బాబు పుట్టాడు. వాణ్ణి కడిగి తల్లి ప్రక్కనే వేసి బయటికి వచ్చాను. అంతవరకూ ఏదో భయం. బాధతో సతమతమౌతూ, కూర్చున్నవాడల్లా నా రాక చూసి—

ఎలావుంది? ఆవిడకైతే ఏమీ అపాయం లేదు కదా? మొదలయిన ప్రశ్నల చూపులతో నా ఎదుటికొచ్చి నిలిచాడు.

"ఫర్వాలేదు. బాబు పుట్టాడు. చాలా బావున్నాడు కావా లంటే వెళ్ళి చూడండి."

"నిజమా సిస్టర్" అంటూ ఏదో పొంగి వచ్చే సంతో షంతో గదిలోకి వెళ్ళాడు.

రెండు నిముషాల తర్వాత మళ్ళీ తిరిగివచ్చి నన్ను సమీ పించి జేబులోనుండి రెండు పదిరూపాయల కాగితాలు తీసి—

"ఇవి ఉంచండి సిస్టర్. మీ మేలు మరువలేం" అన్నాడు.

"అయ్యో- ఇదేంటి. పైసలు దేనికి! నా ఉద్యోగ ధర్మము నేను చేశాను."

"ఐనా ఫర్వాలేదు. సిస్టర్ యివి ఉంచండి" అంటూ మరీ మరీ బలవంతం చేశాడు. ఎంతోసేపు వద్దు చెప్పినాక గాని మళ్ళీ తన నోట్లు తన జేబులో పెట్టుకుంటూ— "మీరు చాలా హెల్ప్ చేశారు. లేకపోతే నా భార్య చచ్చిపోద్దేమో అని నాకు చాలా భయం వేసింది. కానీ— భగవంతుని దయవల్ల, మీ చేతి

చలవవల్ల......"

"ఆఁ నా చేతి చలవ ఏముందిలెండి. యింతకీ నీకు చక్కని బాబు పుట్టాడు. నీ రూపం, ఆవిడ రంగు-"

"ఔనండి చాలా బాగున్నాడు." అంటూ వెళ్లిపోయాడు. ఆవిడను నాలుగు రోజుల తర్వాత డిస్‌చార్జి చేశాము. ఆ నాల్గు రోజులు ఉదయం, సాయంత్రం హాస్పిటల్‌కి వస్తూ తల్లీబిడ్డని చూసి పోయేవాడు—నేనొక వేళ కన్పిస్తే "నమస్కారం సిస్టర్" అని మర్యాదగా మాట్లాడేవాడు.

కొన్ని రోజులు పోయాక ఒకనాటి ఉదయం హాస్పిటల్‌కి వచ్చి నన్ను కలుసుకుని——"బాబుకు పేరు పెడుతున్నాం మీరు తప్పక రావాలి" అన్నాడు. నేను మొదట కాదన్నాను. ఆయన మరీ మరీ రమ్మంటూ "మీ దయవల్లనే మా ఆవిడ బాబిగాడు క్షేమంగావున్నారు. మీరు తప్పక రావాలి." అని ఏదేదో అన్నాక సరేనని టైం ప్రకారం సాయంత్రం చిన్నాడికో బొమ్మను తీసికొని వెళ్లాం. అందరికంటె మంచిమర్యాదగానే చూశారు. ఆ తర్వాత వచ్చేటప్పుడు నేను తీసికెళ్లిన బొమ్మను బాబు ముందుంచి "ఇదిగోరా నీ పెళ్లాం" అన్నాడు. అందరూ సంతోషంగా నవ్వారు. నేను నవ్వాను. ఆ తర్వాత యిక వచ్చేశాను.

మళ్ళీ కొన్ని నెలల తర్వాత ఆతను కల్సి "బాగున్నారా సిస్టర్! మా బాబిగాడు పెద్దవాడౌతున్నాడు. మీరుసారి రకూడదు? వాఁడి పెళ్లాం అదే మీ అమ్మాయితో ఎప్పుడు

తగువు పెట్టుకొని, వాడికి కోపమొచ్చినపుడల్లా దాన్ని చితక కొడతాడు. పాపం చేసేది లేక నేలకు పడిపోద్ది. వాళ్ల పోట్లాడ చూడ్డానికయినా రాండి సిస్టర్."

"అలాగ! ఎంత అన్యాయం మా అమ్మాయిని ఎంత పని చేశారూ" అని నవ్వాను. అతను నవ్వి "ఓ సారి రండి" అంటు వెళ్లిపోయాడు. ఆరోజే సాయంత్రం బిస్కెట్స్ వగైరా తీసుకొని వెళ్లి చూసి వచ్చా.

వాడు నిజంగా కాస్త పెద్దగానే అయ్యాడు. రోజు రోజుకీ చాల ముద్దుగా అవుతున్నాడు. వాడంటే ఎందుకో నాకోమాదిరి ఆప్యాయత ఏర్పడింది, ఎన్నోసార్లు వాండ్లెవ్వరు పిల్వకున్నా వాండ్లింటికివెళ్లి బాబిగాన్ని చూసి వస్తూండేవాన్ని. ఓ సంవత్సరం గడిచింది. వాడి పుట్టినరోజు పండక్కి రమ్మని మరీ మరీ కోరారు.

ఆరోజు నాకు ఆఫ్కూడ వుంది. బాబిగాని కోసం రెడీ మేడ్ డ్రస్సు తీసుకుని మూడు గంటలు ముందే పోయాను. గడియ వేసి వుండడంవల్లా బయటిద్వారం వద్ద ఆగి తలుపు తట్టి పిలువబోయి ఆగిపోయాను. దాదాపు నేను స్థంబించిపోయాను. వాళ్లిద్దరూ పోట్లాడుకుంటున్నారు. మరే విషయానికో కాదు-నా గూర్చే—

"ఆవిడ పుణ్యమా అంటు నీవు బ్రతికావు"

"ఆమె ఉద్యోగ ధర్మం ఆమె చేసింది అంతే కాని..."

Acc. No. 15626
5Q-ஐ894.81331 లోకం
JAN రు. 1-50

"మన బాబిగాడంటే పడి చస్తది తెల్సా..."

"అవును బాబిగాడి తండ్రి అంటే గూడ..."

"ఏమన్నావూ!" వెఱ్ఱిగొంతు వినిపించింది.

"ఉన్నమాటే అన్నాను. దాన్ని తెచ్చిపెట్టుకుంటే కాదు. నన్నెందుకొట్టి చంపాలి? అందుకేగా చీరె జాకెట్, తెచ్చావు" ఏడుస్తూనే అంది.

"ఛీ పాపిష్టిదానా, ఎంతఘోరానికొడిగట్టావే!"

"అంటేనే ఘోరం. అందరూ చూస్తూనే వున్నారు. దాని రాకపోకల్ని."

"ఆవిడ నాకో చెల్లెలాంటిది తెల్సా?"

"అని నీవు నేను అనుకుంటే సరిపోదు! వీధి ఏమంటుందో వినండి?" ఇక వినలేకపోయాను. కళ్లనిండా తిరిగిన నీళ్లు జల జల రాలాయి. అక్కడ నిలబడలేకపోయాను. వెనక్కు మళ్లీ పదిగజాలు నడిచాక............

"సిస్టర్!" అంటూ కేకవేశాడు, అప్పుడే తలుపు తెరుచుకుని బయటికి వస్తూ—

నేను వినిపించుకోకుండా వస్తూనేవున్నాను.

"సిస్టర్" మళ్ళీ కేక వినిపించింది.

నేను రోడ్డుమలుపు తిరిగి కనబడకుండ వచ్చేశాను. యిక అంతే నేనెప్పుడు మళ్లి వాళ్ళింటివైపు వెళ్ళలేదు." అంటు ముగించింది మేరీ. ఏంటో ఈ లోకం అనాలనుకున్న జయ అనలేక బరువైన శ్వాస, మాత్రం వదిలింది.

*